## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015073

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# MAHA PURUSHU.

## Telugu

For Lower Forms

BY

S. V. Rangarao, M. A., B. E

PUBLISHERS :

**Sundara Ram & Sons, Tenali.**

 1945 [ 0—6—0

# విషయసూచిక

# మహా పురుషులు

## శ్రీ రాముఁడు

పూర్వకాలమున నయోధ్యాపురమును బాలించు దశరథుఁడను నొక రాజుండెను. అయోధ్యాపురమునకు సాకేతపురమని కూడ పేరుగలదు. ఆదశరథునకుఁ గౌసల్య, సుమిత్ర కైకలను మువ్వురు భార్యలు కలరు. వారిలోఁ గౌసల్యకు శ్రీరాముఁడును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును, కైకకు భరతుఁడు నను కొడుకులు పుట్టిరి. అందులోఁ బెద్ద కొడుకగు రామునియందు దశరథున కెక్కుడు ప్రేమయుండెను. లోకమంతయు నాతనికి రామునితోడనే యున్నదని తలఁచు చుండును. ఆ దశరథుఁడు తన ప్రాణములన్నియు రాముని మీదఁ బెట్టుకొని కాలము గడపుచుండెను.

రాముఁడు మిథిలానగరమునకు రాజయిన జనకుని కూతురగు సీతను బెండ్లియాడెను. యుక్తవయస్కుఁడైన రామునకు రాజ్యాభిషేకము జేయదలఁచి, దశరథుఁ డాతనిని బిలిచి "రామా! నిన్ను రేపు రాజును జేయుచున్నా" నని పలికి రాముని సమ్మతింపఁజేసెను. రేపు రామునకుఁ బట్టాభిషేకము జరుగునని ప్రజ లెల్లరును సంతోషించుచుండిరి.

పురము మిగులశృంగారముగ నలంకరింపఁబడెను. అనేకు లా మహోత్సవము జూచుటకు వచ్చిరి. రేపు పట్టాభిషేకమనఁగా, నారాత్రి దశరథుఁడు రామాభిషేకమును గూర్చి చెప్పుటకుఁ కైక మందిరమున కరిగెను. కైకయందు దశరథునకు మిగుల యనురాగమున్నది. ఒకసమయమున నీమె దశరథు నితో దానును యుద్ధభూమికిఁ బోయి యాతఁడు మూర్ఛనంది యుండఁగా, శత్రువులకుఁ జిక్కకుండ, రథమును రణభూమి నుండి తప్పించి, యాతనిం గాపాడెను. అట్లు చేసినందులకు దశరథుఁడు మెచ్చి, యామెకు రెండువరములిచ్చెను. వానిని నామె యప్పుడు గోరుకొనక, వలసినప్పుడు గోరుకొందునని చెప్పెను. ఇప్పుడు రామపట్టాభిషేక ప్రయత్నమునుగూర్చి చెప్పుటకుఁ దనకడకు వచ్చిన దశరథునిఁ జూచి, యంతకు మున్నే మంథర యను దాసిచే బోధింపఁబడిన దవుట, కైక, తన కంతకుపూర్వమిచ్చిన వరముల నప్పుడిమ్మని కోరెను. దశరథు డందులకు సమ్మతించెను. భరతుని రాజుగాఁ జేయు మనియు, రాముని బదునాల్గువత్సరము లరణ్యమున వసింపఁ బంపుమనియు, నామె దశరథుని గోరెను. సత్యమును నిలుపు కొనుటకై దశరథుఁడు సమ్మతించెను.

రాముఁడు తండ్రి సత్యముగాపాడుటకు, మునివేష ముతో భార్యయగు సీతయు, దమ్ముఁడగు లక్ష్మణుఁడును వెంటరా నడవులకు, బోయెను. రామునకు దండ్రియందుఁగల భక్తికి సకల లోకములవారును మిక్కిలి సంతసించిరి. రాము డరణ్యమున నుండఁగా లంకకు రాజగు రావణుఁడు సీత

నపహరించి కొనిపోయెను. రాముఁడు నెమ్మదిగా వానిజాడలు దీసి సుగ్రీవుఁడు, హనుమంతుఁడు మొదలగు కపుల సహాయమున సముద్రమును దాటి లంకకుఁ బోయి, రావణుని జంపి, యాతని తమ్ముఁడగు విభీషణునకు లంకకుఁ బట్టము గట్టి సీతను గైకొని తమ్మునితో నయోధ్యకువచ్చి, పట్టాభిషిక్తుఁడయ్యెను.

# లక్ష్మణుఁడు

లక్ష్మణుఁడు శ్రీరామునకుఁ దమ్ముఁడు. అగ్రజునియం దెట్టిభక్తిబూని మెలఁగవలయునో, నేర్చుకొనవలెనన్న నీతని కథ ప్రతిబాలుఁడు చదివితీరవలయును. ఈతనికి రాముని యందు మిగుల భక్తికలదు. అందుచేతనే, రాముఁడరణ్యమునకుఁ బోవునప్పుడు, ఇతఁడుకూడ రాజ్యభోగముల నన్నిఁటిని విడిచి యతనితో నరిగెను. అరణ్యముననున్న రామున కెట్టికష్టము కలుగకుండ రాత్రింబవళ్ళాతనిని సేవించుచుండెను. రాముని సేవకంటె దనకు మఱియొక భాగ్యము లేదని తలంచెను.

సీతను గోలుపోయి రాముఁడీతనితో లంకకరిగి, రావణునితోఁ బోరుచున్నప్పుడీ లక్ష్మణుఁడాయుద్ధములోఁ బెక్కండ్ర రక్కసులఁ గూల్చెను. ముఖ్యముగా రావణుని కొడుకగు నింద్రజిత్తుతో సలిపిన యుద్ధము మహాభయంకరముగనుండెను. ఈతఁడు యుద్ధములో రావణునిశక్తిచేత నొక సమయమున మూర్ఛఁ బొందెను. అట్టిసమయమున రాముఁడు ధైర్యమువిడిచి తమ్మునికై యెంతయో విలపించెను. అప్పుడు హనుమంతుఁడు సంజీవిందెచ్చి లక్ష్మణుని బ్రతికించెను.

రాముఁడనేక సంవత్సరములు రాజ్యమేలిన పిమ్మట నొకనాడు యముఁడు మునివేషమున రామునికడకు వచ్చి

"నీతోఁగొన్ని రహస్యములు మాటలాడుటకువచ్చితిని. నీవును నేనును మాటలాడుచుండఁగా నెవ్వరునురాగూడదు. అట్లెవ్వరైన వచ్చినచో వారిని వధింపవలయు" నని చెప్పి యందుల కాతనిని సమ్మతింపఁజేసెను. రాముఁడు లక్ష్మణునితో "లోని కెవ్వరిని రానీయవల" దని చెప్పి ద్వారమునందు నిలిపెను. యముఁడు రామునితో మాటలాడఁదొడఁగెను. యముఁడు రాముని గాంచి "రామా! నేను యముఁడను. బ్రహ్మ పంపఁగా నిన్ను జూడవచ్చితిని. నీవు భూమిలో నవతార మెత్తి చేయవలసిన పనులన్నియుఁ జేసితివి. కావున నవతారముఁ జాలింపుమని బ్రహ్మ చెప్పెను." అని యింకను నేమేమో సంగతులు చెప్పుచుండెను. ఆసమయమునందే రాముని జూచుటకు దుర్వాసుఁడు వచ్చెను. ద్వారమునందు లక్ష్మణుఁడు నిలిచియుండెను. లోపలికి బోనిమ్మని యా మునీంద్రుఁడు లక్ష్మణు నడిగెను. లక్ష్మణుఁడు "స్వామీ! రాముడిప్పుడే వచ్చును. ఎవరితోడనో రహస్యము మాటలాడుచున్నాఁడని బదులు చెప్పెను. దుర్వాసు డతని మాటలకుఁ గోపమంది తన్ను రామునిఁ జూచుటకు బోనీయ కున్నచో రవివంశమంతయు నీరగునట్లు శపించెదనని పలికెను. లక్ష్మణుఁడు భయపడి లోపలికిఁబోయి, రామునకు దుర్వాసుని రాక నెఱింగించెను. లక్ష్మణుని రాకఁజూచి యముఁడు మాయమయ్యెను. తరువాత దుర్వాసుఁడు వచ్చి రామునితో మాటలాడి యరిగెను.

రామునితో యముఁడు మాటలాడునప్పుడు, వచ్చిన వారిని జంపుమనని రాముఁడు ప్రతిజ్ఞఁ జేసియుండెను. ఇప్పుడు రాముఁడు లక్ష్మణునిఁ జంపవలయును. తనయందు మిగుల భక్తియుఁ బ్రేమయుఁ గలిగియున్న తమ్ముని నెట్లు జంపుమనని రాముఁడు మిక్కిలి దుఃఖింపఁదొడంగెను. లక్ష్మణుఁ డన్నను జూచి "రామా! నీవు నన్నుఁగూర్చి శోకింపవలదు. నీవు శ్రీమన్నారాయణుఁడవు. నీ ప్రతిజ్ఞకై నా దేహ మర్పించుటకన్న మఱియొక పుణ్యము లే"దని పలికెను. అప్పుడు రాముఁడు వసిష్ఠుని వచనముల ననుసరించి లక్ష్మణుని బరిత్యజించెను. అట్లు సేయుట ధర్మమని వసిష్ఠుఁడు రామునకుఁ జెప్పెను. రామునిచేఁ విడువబడిన లక్ష్మణుఁడు సరయూనదింబడి దేహము జాలించెను. తరువాత రాముఁడు గూడఁ దన కుమారులగు కుశలవులకుఁ బట్టాభిషేకము జేసి, తక్కిన తమ్ములతో నిజలోకమున కేగెను.

# గుహుఁడు

మానవుఁ డేకులమునఁ బుట్టినను, మంచిబుద్ధి, పెద్దల యందు భక్తి, పరోపకారము, జ్ఞానము, మొదలగు సత్తమ గుణములచేఁ బ్రకాశించువాఁ డందఱిచేతను గొనియాడఁ బడును. గుహుఁడొక పల్లెవాఁడు. గంగానదిపై నోడ నడుపుచుండెను. రాముఁడరణ్యములకుఁ బోవునప్పుడు, గంగా తీరమునకుఁ బోయెను. గుహుఁడు సీతారామ లక్ష్మణుల ననేకవిధములం బూజించి వారు వనమునకుఁ బోవుటకుఁ గారణ మెఱింగి రాముని జూచి "రామా! నీవిచ్చటనుండి మా పల్లెరాజ్యము నేలుము. నేను నా వారందఱితో నీకు సేవలు జేయుచుందు" మని పలికి తన సంపూర్ణమైన భక్తిని బ్రకటించెను. రాముఁడందులకు మిగుల సంతసించి "గుహుఁడా! నీకు నాయందున్న భక్తి కెంతయు మెచ్చితిని. నీకు సర్వశుభములు జేకూరును. మమ్ము గంగానదిని దాటింపు" మనెను. అంతట నాతఁడు సీతారామ లక్ష్మణులను గంగ దాటించెను.

రాముఁడు వనవాసము పూర్తిఁజేసి యయోధ్యకు వచ్చునప్పుడు గుహుని సేమమరయుటకు ముందుగా హనుమంతునిఁబంపి, తన యనురాగమును జూపెను. గుహుఁడు శబరుఁడైనను, రాముఁ డాతనికి హనుమద్విభీషణాదులకిచ్చిన గౌరవము నిచ్చెను.

# జటాయువు

జటాయువు పక్షికులమునందుఁ బుట్టినవాఁడు. విష్ణుభక్తిపరాయణుఁడు. ఈతఁడు దండకారణ్యమున నుండఁగా రావణుఁడు సీత నెత్తుకొని పోవుచుండెను. ఆసమయమున నామె తన్నెవ్వరైన రక్షింప రండని యెలుగెత్తి యేడ్చెను. ఆమె యేడుపువిని సమీపముననున్న జటాయువు పరుగెత్తుకొని వచ్చి రథమున కడ్డముగా నిలిచి రావణునుద్దేశించి యిట్లు పలికెను. "ఓరీ! రావణా! రాముఁడు పర్ణశాలలో లేకుండుటఁ జూచి నీ వీమెను నపహరించుకొని పోవుచుంటివి. నీకుసమస్త ధర్మములు తెలియును. బ్రహ్మకులమునందుఁ బుట్టినాఁడవు. శాస్త్రము లన్నియు జదివినాఁడవు. అట్టిచో నీవిట్లు సేయుట ధర్మమైన పని కాదు. రాముని్ఁ గేవలము మానవునిఁగాఁ దలంపవలదు. ఆతఁ డాదినారాయణుఁడు. భూభారము దీర్చుటకు రామరూపమునఁ బుట్టినాఁడు. నీవు బ్రతుకదలంచినవాఁడవేని, యీమెను విడువుము. అని యనేకవిధముల నీతులు జెప్పెను. రావణుఁడు వినలేదు. అందుచే, సీతను రక్షించుటకై జటాయువు రావణునితో గొప్పయుద్ధము జేసెను. కాని, రావణుఁడాతని రెక్కలు ఖండించి సీతను గైకొని పోయెను.

సీతను వెదకుచు రామలక్ష్మణులువచ్చి రెక్కలులేక పడియున్న జటాయువును నాతని వృత్తాంతమంతయు గను

గొనిరి. రాముఁడు తన భార్యకొఱకు జటాయువున కట్టి స్థితిఁ సంభవించెనుగదా! యని మిగుల చింతించెను. జటాయువు రామునిజూచి "రామా! సీతవృత్తాంతము నీకుఁ దెలుపుటకే నాశరీరమునఁ బ్రాణములు నిలిచియున్నవి, ఇఁక నేను జీవములు విడిచెదను" అని పలికి ప్రాణములు విడిచెను. రాముఁడు దశరథుని మృతికన్న నెక్కుడుగ దుఃఖించి, "ఈతఁడు మహాతపస్సు జేసిన యోగీశ్వరులకైనను లభించని దివ్యమయిన పదవిని బొందుఁగాక" యని పలికి, యాతనికి స్వయముగ నగ్నిసంస్కార మొనర్చెను.

# హనుమంతుఁడు

హనుమంతుఁ డంజనీదేవియందు కేసరియను వానరునకు వాయుదేవుని వరమునఁ బుట్టెను. ఈతఁడు సూర్యుని యొద్ద సమస్త శాస్త్రములను జదివెను. ఈతఁడు మిగుల బలవంతుఁడును, పరాక్రమ ధైర్యములును గలిగినవాఁడై యుండెను. చిన్నతనమునందు సూర్యునిఁ జూచి, పండని తలంచి యాతనిం బట్టుకొనఁ బైకెగిరెను.

ఈతఁడు సమస్త విద్యలను సంపాదించిన పిదప, తండ్రి యాజ్ఞననుసరించి కిష్కింధకుఁబోయి సుగ్రీవుని నాశ్రయించి యాతనికిఁ బ్రాణమిత్రుఁడై యుండెను. వాలిచేత సుగ్రీవుఁడు రాజ్యమునుండి వెడల నడుపఁబడినప్పు డీతఁడు సుగ్రీవుని విడువక యాతనితో ఋష్యమూకాద్రికి వచ్చియుండెను.

రామలక్ష్మణులు సీతను వెదకుచు నిచ్చటికి వచ్చినప్పుడు వారికిని సుగ్రీవునకును సఖ్యము గలిపినది యాతఁడే. రాముఁడు వాలిం జంపి, సుగ్రీవునిఁ గిష్కింధకుఁ బట్టము గట్టిన తరువాత, నాసుగ్రీవుఁడు రాజ్యభోగములందుఁ దగిలి, రామకార్యమును మఱచియుండెను. అప్పుడు హనుమంతుఁ డాతని కెన్నో నీతులఁ జెప్పెను. సీతను వెదకుటకు సుగ్రీవుఁడు కపులను ననేక స్థలములకు బంపునప్పుడుఁ రాముఁడు హనుమంతుని వలనఁ గార్యము చక్కబడునని తలంచి యాతని లంకకుఁబొమ్మని చెప్పి, సీత కానవాలుగాఁ జూపుటకుఁ దన యుంగర మిచ్చెను. స్వామికార్య ధురంధరుఁడయిన యా

హనుమంతుఁడు రాముని యాజ్ఞను శిరమునఁబూని, సముద్రము దాటి లంకకుఁ బోయెను. అచ్చట నాతఁడు సీతాదేవినిజూచి, రాముని కుశలవార్త నెఱిఁగించి, మరల నామె శిరోమణిని రామునకుఁ జూపుటకుఁ గైకొనెను. పిదప నాతఁడు లంకలోని రాక్షసుల బలపరాక్రమములు చూడఁదలఁచి, యశోకవనమును పాడుచేసెను. అందుచేఁ బెక్కండ్రు దైత్యు లాతనిపైకి వచ్చి మడిసిరి. తుద కాతఁడు రావణుని పుత్రుఁడగు నింద్రజిత్తుచే బంధింపఁబడి రావణుని సమ్ముఖమునకుఁ గొనిపోఁబడెను. హనుమంతుఁడు తన వృత్తాంతమంతయు రావణునకు నెఱింగించుటయే గాక, యనేక నీతులు చెప్పెను. అప్పుడు రావణుఁడు హనుమంతుని తోఁకకు నూనెలో ముంచిన గుడ్డలు చుట్టించి, అగ్ని బెట్టించి విడిచిపెట్టెను. అంతట హనుమంతుఁ డావాలమున మండుచున్న మంటలతో లంకాపురము నెల్లఁ గాల్చి, సముద్రతీరమునకు వచ్చి, దానిందాటి కిష్కింధకుఁబోయి రామునకు సీతవార్త వినిపించి, యాతనికి సంతోషము గలుగఁజేసెను.

రామునకును రావణునకును జరిగిన యుద్ధములో హనుమంతుఁ డనేక రాక్షసులను జంపెను. రావణుని శక్తిచే మూర్ఛబొందిన లక్ష్మణుని బ్రతికించుట కితఁడు సంజీవిఁదెచ్చి రాముని యనుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను. హనుమంతునకు రామునియందున్న భక్తి యపారమైనది. రామునకుఁ గూడ నాతనియం దట్టిప్రేమయే యున్నది. హనుమంతుఁడు చిరంజీవి.

# విభీషణుఁడు

విభీషణుఁడు లంకాపురము పాలించు రావణునకుఁ దమ్ముఁడు. ఈతఁడు దైత్యుఁడైనను, శాంతము, ధర్మబుద్ధి, పరోపకారము, మొదలగు సద్గుణములు గలిగియుండెను. సీతను రావణుఁ డపహరించి తెచ్చినప్పు డీతఁడు రావణున కట్టికార్యము వలదని యనేక తెఱంగుల బోధించెను. కాని యాతఁడు వినలేదు. మఱికొన్నాళ్ళకు రాముఁడు వానరబలములతో సముద్రముదాటి వచ్చుచున్నాఁడని విని రావణుని యొద్దకుఁబోయి, యిట్లు చెప్పెను—"అగ్రజా! రాముఁడు వానరబలములతో వచ్చుచున్నాడు. ఆతఁడు సామాన్యమానవుఁడు కాఁడు. శ్రీహరి. సీతయే లక్ష్మీదేవి. ఆతని నెవ్వరును జయింపలేరు. నీవు దైత్యకులమునకు వినాశము గల్పించుటకే యిట్టి పని జేసితివి. రాముఁ డిచ్చటికి వచ్చెనేని సమస్తదైత్యులతో లంకాపురమెల్ల సముద్రమునఁ దప్పక కలుపును. కావున నీవు దైత్యకులమును రక్షించి, నీప్రాణములఁ గాపాడుకొనఁ దలఁచినచో శీఘ్రముగా సీతను రామునకిచ్చి శరణుబొందుము."

అనిన విని, రావణుఁ డాగ్రహించి విభీషణు ననేక దుర్భాషలాడి, తన్ని, సభనుండి వెడలనడిపెను. విభీషణుఁడా పరాభవమును సహింపఁజాలక, వెంటనే రాముని సన్నిధికిఁ

బోయి యాతని శరణుబొంది తన స్థితియంతయు విన్నవించెను. హనుమంతుఁడు విభీషణుని బుద్ధి నంతకుమున్నె గ్రహించి యున్నవాఁడగుటచే, రామునితో నాతఁడు చేపట్ట నర్హుఁడే యని పలికెను. రాముఁ డాతని కభయమిచ్చి తనయొద్ద నుంచుకొనెను. రాముఁడు, రావణుని జంపిన పిదప, విభీషణుని లంకారాజ్యమున కభిషిక్తుని జేసెను.

# కుశలవులు

చిన్నతనమునందే యపరిమిత శౌర్యపరాక్రమములం జూపి, కన్నతండ్రి యగు రామునకుం గూడ వెఱపు గలిగించిన కుశలవుల చరిత్ర మఱి పవిత్రమైనది. ఈ కుశుండును, లవుండును, రామునకుం బుత్రులు. ఎవండో యొక రజకుండు సీతను గూర్చి యాడినమాటల ననుసరించి, రాముండామెను లోకనింద నివారించుకొనుట కరణ్యములకుం బంపించెను. అప్పు డీమె నిండు చూలాలై యుండెను. ఆమెను అరణ్యములకు రాముని యాజ్ఞపై లక్ష్మణుండు తోడ్కొనిపోయెను. అరణ్యమధ్యమునకు దీసికొనివచ్చి లక్ష్మణుండామెకు రాముని యభిప్రాయ మెఱింగించి విడిచిపెట్టి యరిగెను. తన చిత్తశుద్ధి బాగుగ నెఱింగిన రాముండే నన్నిట్లు జేసెగదా! యని యామె ఘోరముగ విలపించుచుండ, నాసమయమున నచ్చటికి వచ్చిన వాల్మీకి యను మునీంద్రుం డామె యేడుపు విని సమీపించి, యామె వృత్తాంత మంతయు దివ్యదృష్టివలన నెఱింగి, ధైర్యముజెప్పి తన యాశ్రమమునకుం దోడ్కొని పోయెను.

వాల్మీకి యామెను తన యాశ్రమమునకుం దోడ్కొని పోయి యామెకుం బరిచర్యలు సేయుటకుం దాపసకన్యల నియమించెను. అచ్చటివారందఱు నామెయందు మిగుల భక్తిం జూపి మెలంగుచుండిరి. వాల్మీకియు నామె కెట్టి

కొంతయు లేకుండ గన్నబిడ్డకంటె నెక్కుడు ప్రేమతోఁ జూచుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడిచిన పిదప, సీతామహాదేవి కుశలవులఁ గనెను. ఆకుమారులు దినదినాభివృద్ధిపొంది, విద్యాభ్యాసమునకుఁ దగిన వయస్సు గాంచిన యంతనే వాల్మీకి వారికి సమస్త విద్యలును నేర్పఁ బ్రారంభించెను. కొన్నాళ్ళకు వారు శాస్త్రములును, క్షత్రియులకు ముఖ్యముగా, నుండవలసిన ధనుర్విద్య మొదలగునవి యన్నియు సమగ్రముగ నేర్చిరి. అశ్విని దేవతలవలె నొప్పుచున్న యాకుమారులు తమ బాల్యచేష్టలచేతను, యనుపమాన సాహస కార్యములచేతను నాశ్రమవాసుల కెల్లరకును మోదము గలిగించుచుండిరి. ఇట్లుండ వరుణలోకమున జరుగనున్న యాగమును జూచుటకై వాల్మీకి పోదలఁచి యా వృత్తాంతము సీతతోఁ జెప్పి కుశలవుల నాశ్రమమున జాగ్రత్తగా నుండుమని చెప్పిపోయెను.

కుశలవు లెప్పుడును నేవో సాహసకార్యములఁ జేయుచుందురు. అందులోఁ గుశునికంటె లవుఁడు మిగుల తొందరగలవాఁడు. అరణ్యమునందున్న వ్యాఘ్రములను బట్టుకొనివచ్చి కుక్కలవలె, నాశ్రమముముందుఁ గట్టుచుండును. ఒకనాఁడు లవుఁడొక మునిబాలునితో నరణ్యమునకుఁబోవఁగా, నచ్చటికొక యాగహయము వచ్చెను. మునిబాలుఁడు వలదనుచున్నను లవుఁడు వినక దానిని బంధించెను. అది రాముని యజ్ఞాశ్వము. దాని కంగరక్షుగా శత్రుఘ్నుఁడు వచ్చియుండెను. దాని మొగమున "వీరులైనవారు దీనిం బట్టుఁ"

డని బిరుదుపట్టము వ్రాసియుండుట జూచి, లవుఁడు దానిం బట్టుకొని యొక చెట్టునకు గట్టివేసెను. అంతలో శత్రుఘ్నుఁడచ్చటికివచ్చి, లవునిజూచి గుఱ్ఱమును విడువుమని చెప్పెను. అతఁడొక్కింతయు భయమునందక, "వీరుడను గావున దీనిం బట్టితిని. నీకు శౌర్యమున్నచో విడిపించుకొను" మని ప్రత్యుత్తర మిచ్చెను.

బాలుని వాక్యములు శత్రుఘ్నునకు మిగుల సంతోషమునే కలుగజేసెను గాని యెంతచెప్పినను అతఁడు గుఱ్ఱమును విడువక పోవుటచే యుద్ధమునకుదిగి, లవుని మూర్ఛపుచ్చి తనరథముపైఁ బెట్టుకొని పోవుచుండెను. లవునివెంట వచ్చిన మునిబాలుఁడు కడురయమునఁబోయి యాతని వృత్తాంతము సీత కెఱిగించెను. ఆమె లవునివార్తవిని పెద్ద పెట్టున నేడ్వదొడఁగెను. అప్పుడే యచ్చటికిఁ గుశుఁడువచ్చి తల్లివలనఁ దమ్ముని వృత్తాంతమువిని, యామెకు ధైర్యము జెప్పి తొందరగాఁబోయి శత్రుఘ్నుని రథము నడ్డగించి యుద్ధమునకుఁ గడంగెను. ఇంతలో రథముపైనున్న లవుఁడు మూర్ఛఁదెలిసి లేచి కుశునిఁజూచి సంతోషించెను. కుశలవు లిరువురును నతిపరాక్రమముతోఁబోరి శత్రుఘ్నుని మూర్ఛపుచ్చి మరల మఖవాజిని బంధించిరి. ఆ మఖవాజి కొఱకు లక్ష్మణుఁడు, భరతుఁడునువచ్చి యక్కుమారుల బాణములచే మూర్ఛనందిరి. తుదకు రాముఁడే వచ్చెను. రాముఁడు తమ తండ్రియనుమాట కుశలవులెఱుంగరు. రామునకా కుమారు లను జూచినంతనే యొకవిధమగు వాత్సల్య ముదయించి

క్రతుతురంగమును విడిచినచో వస్త్రములుగాని, రథములు గాని, కరులుగాని, హయములుగాని— ఇవియవి యననేల! తుదకు సాకేతపురమున నర్ధరాజ్యమైన నిచ్చెదనని చెప్పెను.

ఎంతభయ పెట్టినను వారు వినలేరు. కుశలవులకును రామునకును బెద్ద యుద్ధము జరిగెను. రాముడొక తీవ్రమైన శరము కుశలవులపై బ్రయోగించగా నది పూలహారమయ్యెను. మరల గుశలవులొక యస్త్రమును దొడిగి "మాతల్లియగు సీతామహాదేవి జగన్నుత కీర్తిగాంచిన పతివ్రత యయ్యెనేని యీయస్త్రమీతనిని మూర్ఛపుచ్చుగాక" యనిపలికి రామునిపై బ్రయోగించిరి. అంతట రాముడు మూర్ఛిల్లెను. ఈసమర విధానమంతయు సీతకు మునిబాలకుల వలన దెలిసెను. కుశలవుల చేతిలో మూర్ఛబొందినవారు రామాదులేయని యామెగ్రహించి విలపించుచుండెను. అంతనచటికి వరుణలోకమునకు బోయిన వాల్మీకి యరుదెంచి, యామెకు ధైర్యముజెప్పి యుద్ధభూమికివచ్చి మూర్ఛనున్న వారిపై దనకమండలు జలములుజల్లెను. వెంటనేయందఱును లేచిరి. వాల్మీకి సీత వృత్తాంతమును, గుశలవుల జన్మక్రమమును జెప్పి వారిని రామున కొప్పగించెను. రాముడు కుమారులను జూచి మహానందమునుబొంది, సీతను గ్రహించెను.

# ధర్మరాజు

హస్తినాపుర రాజ్యమును పాలించిన భరతవంశపు రాజులలో ధృతరాష్ట్రుఁడు పాండురాజు నను నిరువు రన్న దమ్ములు గలరు. పాండురాజు సంతతి పాండవు లనియు, ధృతరాష్ట్రుని సంతతి కౌరవులనియుఁ బిలువఁబడుచుందురు. పాండురాజున కైదుగురు కొడుకులు. ధృతరాష్ట్రునకు నూర్గురు. పాండవులలోఁ బెద్దవాఁడు ధర్మరాజు. అతని గుణములు పేరునకు దగినట్లుండెను. కౌరవులలోఁ బెద్దవాఁడు దుర్యోధనుఁడు. అతఁడు కుటిలుఁడును, అసూయాపరుఁడును, దురాశయుఁ గలిగినవాఁడై యుండెను. పాండవులకును గౌరవులకును రాజ్యభాగమును గూర్చి వివాదము సంభవించెను.

పెద్దలమాటలు విని ధృతరాష్ట్రుఁ డెట్లో పాండవులకు ఇంద్రప్రస్థపుర రాజ్యము నిచ్చెను. ధర్మరాజింద్రప్రస్థమున నుండి రాజ్యమేలుచు, ధర్మము దప్పక తమ్ముల సహాయమున రాజ్యము వృద్ధిఁ జేసికొని రాజసూయయాగము జేసెను. ఆయాగమును జూచుటకు దుర్యోధనాదులు కూడ వచ్చిరి. దుర్యోధనుఁడు పాండవుల వైభవముజూచి యోర్వలేక, వారి రాజ్యము నపహరింపఁదలఁచి దర్మరాజును జూద మాడుట కాహ్వానించెను. ధర్మరాజునకు జూదమునందు మిగుల యభిలాష కలదు. అందుచే నాతఁడు జూదమునకు

సమ్మతించెను. దుర్యోధనుని పక్షమున నాతని మేనమామ యగు శకుని నిలిచెను. ఈతఁడు మాయజూద మాడుట యందుఁ బ్రవీణుఁడు. ధర్మరాజు జూదమున సమస్తరాజ్యమును నోడిపోయి పండ్రెండేండ్లు వనవాసమును, నొక్కయే డజ్ఞాతవాసమును జేయుటకు సమ్మతించెను. ఈ నియమమును దీర్చివచ్చి ధర్మరాజు, తమ రాజ్యభాగము తమకిమ్మని యడుగుటకుఁ గృష్ణుని కౌరవులకడకు రాయబారిగాఁ బంపెను.

శ్రీకృష్ణుఁడు పాండవుల ధర్మసంధతను గూర్చి నిండుసభయందుఁ జెప్పి, పాండవులకు రాజ్యభాగము నిమ్మనెను. మూఢుఁడయిన దుర్యోధనుఁడా వాసుదేవుని మాటలు వినక "సూది మోపునంత నేలయైన నీయ" ననెను. ఆ కారణమునఁ గౌరవులకును బాండవులకును యుద్ధము జరిగెను. భగవంతుఁడైన కృష్ణుడు పాండవుల పక్షమున నుండెను. ఆ యుద్ధమునఁ బాండవులు గెలిచిరి. కౌరవులందఱును మడిసిరి. హస్తినాపుర సామ్రాజ్యమునకు ధర్మరాజు పట్టభద్రుఁడయ్యెను.

'ధర్మమెచ్చటనుండునో యచ్చట భగవంతుఁడుండును'

# భీష్ముఁడు

భీష్ముఁడు హస్తినాపురమేలు శంతనునకు గంగయందు జన్మించెను. ఈతఁడు పరశురామునియొద్ద విద్య గఱచెను. శంతనుఁ డొకనాఁడు విహారార్థము యమునానదీతీరమున కరిగి, యచ్చట నోడ నడుపుచున్న సత్యవతిని జూచి మోహితుఁడై యామె తండ్రికడకరిగి, యామెను దనకిచ్చి పెండ్లి సేయుమని యడిగెను. అందులకు దాశరాజు సంతసించెను గాని "సత్యవతియందు గల్గు పుత్రునకు రాజ్యమిచ్చినచో నట్లు చేసెద" నని చెప్పెను. శంతనుఁడు తనకు గంగయందు జనించిన భీష్ముని దలఁచి యందుల కేమియుఁ జెప్పఁజాలక గృహమునకు వచ్చెను. ఆతఁ డింటికి మరలివచ్చెనను మాటయేగాని, సత్యవతిపై బెంగచే నిద్రాహారములుమాని నానాటికి శుష్కించుచుండెను. ఈవిధమంతయుఁ జూచి భీష్ముఁడుతండ్రిసన్నిధికరిగి చింతకు గారణమడిగెను. శంతనుఁడు భీష్ముని గాంచి యిట్లు పలికెను. "కుమారా! ఏకపుత్రకుఁడును అనపత్యుఁడును నొక్కటే యని శాస్త్రములు చెప్పుచున్నవి. నీవు మహావీరుండవు. నీయునికి నమ్మరాదు. కావున నింకను దనయులఁ బడయుటకు వివాహ మాడవలయునని నాకుఁ గోరిక కలదు.

భీష్ముఁడు తండ్రిమాటలు విని, పురోహిత మంత్రులతో యోచించి, తండ్రి మనస్సు సత్యవతియందుఁ జిక్కియుండు

వెడలిఁగి, దాశరాజుకడకుఁ బోయి "మా తండ్రికి నీపుత్రిక యగు సత్యవతినిచ్చి పెండ్లిసేయు"మని కోరెను. దాశరాజు గాంగేయుని జూచి "నీవు జనకార్థమై కన్యార్థివై వచ్చితివి. నీ పితృభక్తికి సంతసించితిని. నాయట్టివానికి మీయట్టివారి సంబధము లభించుట దుర్లభము" అని పలికి, శంతనునితోఁ జెప్పినట్లే చెప్పెను. ఆమాటలువిని భీష్ముఁ డందఱు విను చుండగా "మాతండ్రి కొఱ్యార్థమై నేనిదే రాజ్యమును వదలు కొనుచున్నాను. సత్యవతియందు జనించిన కొమరుఁడే రాజు కాఁగలఁడు. అతడే కులకర్తయగు" నని పలికెను. ఇట్లు భీష్ముఁడు చెప్పెనుగాని దాశరాజామాటలతోఁ దృప్తినొంద లేదు. అతఁడు మరల భీష్ముంగాంచి "గంగా తనూభవా! నీవు సకల ధర్మములు తెలిసినవాఁడవు కావున నట్లు పలికితివి. నీకుఁ బుట్టు కుమారు లోర్చియుందురా?" యనెను. అప్పుడు భీష్ముడు "నేను వివాహమే యాడను." అని శపధము జేసెను. భీష్ముఁడట్టి ప్రతిజ్ఞచే దాశరాజు నొప్పించి, సత్య వతినిఁ దనతండ్రికి వివాహముఁ జేయించెను. తన విషయమై కుమారుఁడట్టి ప్రతినఁ దాల్చినందులకు శంతనుఁడు సంత సించి, యాతనికి స్వచ్ఛందమరణము వరముగా నిచ్చెను. ఈకార్యము జేయుటచే భీష్ముని నెల్లవారును గొనియాడిరి.

కౌరవులకును పాండవులకును గలిగిన రాజ్యభాగ మును గూర్చిన వివాదములోఁ బాండవుల కర్థ రాజ్యము నిమ్మని కౌరవుల కీతఁడెన్నో నీతులు చెప్పెను. కాని వారు

వినలేదు. ఈతఁడు కౌరవపక్షమునందే యుండి పాండవులతోఁ బోరాడి, తుద కర్జునునిచేఁ గూలెను.

ఈతని నిర్యాణదినము "భీష్మ ఏకాదశి" యను పేరఁ బవిత్రపర్వముగ నెన్నఁబడుచున్నది.

# విదురుఁడు

విదురుఁడు వ్యాసుని యనుగ్రహమున శంతనుని కోడలగు నంబికయొక్క దాసియందు జనించినవాఁడు. ఈతఁడు సకలధర్మవేత్త. సద్గుణవిరాజితుఁడు. శాంతస్వభావుఁడు. శ్రీకృష్ణునియం దీతనికి మిక్కిలి భక్తికలదు. పాండవుల యందు మిగుల ప్రేమకలవాఁడు. అయినను నితఁడు మొదటి నుండియు, కౌరవులయొద్దనే యుండెను. కౌరవులయొద్ద నున్నను పాండవులు ధర్మబుద్ధి గలవారగుటచే వారి కన్యాయము సేయఁదలదని పెక్కుమారులు కౌరవులతో నిర్భయముగాఁ జెప్పుచు వచ్చెను. శ్రీకృష్ణుఁడు పాండవపక్షాతయై కౌరవులకడకు వచ్చినప్పుడు దుర్యోధనుఁ డాతనిని తనయింట విందుఁ గుడుచుటకు రమ్మని పిలిచెను. విదురుని ధర్మసంధతయు, భక్తియు నెఱింగిన వాఁడగుటచేఁ గృష్ణుఁడు దుర్యోధనునిఁజూచి "దుర్యోధనా! నీవు నన్ను నీగృహమున విందుఁ గుడుచుటకు బిలిచినందుల కెంతయు సంతసించితిని. కాని, నేను వచ్చిన కార్యము ఫలింపకుండ నీయింట నన్నము కుడువరాదు. ఇప్పట్లు నాకు విదురుని యన్నము భోక్తవ్యము. కావున నేనచ్చటి కేగెద" నని పలికెను. విదురుఁడు శ్రీకృష్ణుని ఇంటికిఁ దోడ్కొనిపోయి యనేకవిధములఁ బూజించి సంతృప్తుని జేసెను.

కురుపాండవ యుద్ధము జరుగకుండ విదురుఁడెంతయో ప్రయత్నించెను. కాని, సార్థకము లేకపోయెను. భారత యుద్ధానంతరమున విదురుఁడరణ్యమునకు బోయి శ్రీకృష్ణుని మనంబున నిలిపి, తపస్సు జేసి యోగమార్గమున శరీరము విడిచెను.

# కర్ణుఁడు

ప్రజలకు రాజు విష్ణుమూర్తి వంటివాఁడు. అందుచేఁ దన్నుఁ బోషించు రాజునందుఁ బ్రతిమానవుఁడును భక్తిఁబూని మెలఁగవలయును. కర్ణుఁడు కుంతీదేవికి సూర్యుని వరమున వివాహమునకుఁ బూర్వమే జనించి చిత్రరథ రాధలను సూత దంపతులచేఁ బెంపఁబడెను. ఈతనికి రాధేయుఁడను పేరు గూడ గలదు.

కర్ణుఁడు పరశురాముని యొద్ద నస్త్రవిద్య నభ్యసించి, హస్తినాపురాధీశ్వరుఁడగు దుర్యోధనునకుఁ బ్రాణసఖుఁడై, అంగదేశపురాజయ్యెను. దుర్యోధనుఁడీతనినమ్మియే పాండవులతో యుద్ధమునకు దిగెను. శ్రీకృష్ణుఁడు పాండవ రాయబారియై కౌరవుల యొద్దకు వచ్చినప్పుడు, కర్ణుని నెట్లయినఁ బాండవులఁ జేరునట్లు సేయవలయునని తలంచి యతనిం గాంచి యిట్లుపలికెను. "కర్ణా! నీజన్మనుగూర్చి నీకుగొంత తెలుపవలసియున్నది. నీవు సూర్యుని వరమునఁ గుంతికిఁబుట్టి సూతునిచేఁ బెంపఁబడినావు. కావున నీవు నిజముగా సూతుఁడవు కావు. నీవు పాండవేయుఁడవే. ఈసంగతి తెలియక సుయోధనుని గొలుచుచుంటివి. ఇప్పుడయినను నామాటలు విని పాండవులఁ జేరుము. భూతలమంతయు నీచేత

నేలించెదవు. ధర్మరాజు తన నలువురు తమ్ములతో నిన్ను సేవించును. ఇదియుంగాక ద్రౌపది నిన్నాఱవ భర్తగ వరించును."

కృష్ణుని పలుకులు విని కర్ణుఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "కృష్ణా! నీవు నాయందుఁ జూపిన కరుణకు సంతసించితిని. నా జన్మక్రమము నేను సూర్యునివలననే వినియుంటి, దానిని రహస్యముగ నుంచితిని. లోకమున నీకుఁ దెలియని పరమధర్మములు లేవు. భగవంతుఁడు నన్నే కార్యము సేయుటకుఁ బుట్టించెనో యది సేయుటయే నాకుఁ గర్తవ్యము. నాధర్మము నేను కాపాడుకొనవలయును. అందుచేతనే సూర్యుఁడు వలదని చెప్పినను నాకవచ కుండలములను బ్రాహ్మణవేషమున నర్థింప వచ్చిన మహేంద్రునకిచ్చి నాజన్మవ్రతమును నిలుపుకొంటిని. చంచలమైన భాగ్యలక్ష్మి కాసించి నాశాశ్వతయశమును గోలుపోవు వాడనుగాను. నాకీర్తికిని, నాశౌర్య ప్రతాపములకును దుర్యోధనుఁడే కారణుఁడు. ఇంతవఱకు నాతని యుప్పుపులుసుఁ దిని జీవించుచుంటిని. కృష్ణా! నేనాతనిని విడిచితినేని ప్రజలు నన్ను తిరస్కార దృష్టితోఁ జూచెదరు. ముకుందా! లోకముచే నన్నధర్మవర్తనుఁడని పిలిపింపఁ బ్రయత్నింపవలదు. నీచములగు నిహలోక సౌఖ్యముల కాసించి నేను స్వధర్మము విడువను. నా ప్రాణ మున్నంతవఱకు దుర్యోధనుని పక్షమున నిలిచి యుద్ధము సేయుదును. అతనికై నా ప్రాణము లయిన నర్పించెదను."

కర్ణుని పలుకులు విని, కురునాథునియం దాతని కున్న భక్తికి సంతసించి కృష్ణుఁడు "కర్ణా! నీ ధర్మసంధతకు మిగుల సంతసించితిని. నీ సద్గుణములు లోకులు నేర్చుకొందురు గాక" యని పలికెను. తరువాత భారత యుద్ధమున కర్ణుఁడు కౌరవుల పక్షమున నిలిచి యమానుష పరాక్రమముతోఁ బోరాడి వీరస్వర్గ మలంకరించెను.

# అభిమన్యుఁడు

లోకఖ్యాతిఁ గన్న మహాపురుషులు వృద్ధులయినను, బాలురైనను సర్వలోకముల వారిచే నుతింపబడుచుందురు. శౌర్య పరాక్రమములకును, సత్ప్రవర్తనకు, వయసుతో నేమియుఁ బనిలేదు. భారతమునఁ జెప్పబడినవారిలో యభిమన్యుఁ డొక యద్వితీయుమైన వీరాగ్రేసరుఁడు. ఈతఁడు పాండవమధ్యముఁడగు నర్జుననకుఁ గృష్ణుని సహోదరియగు సుభద్రయందు జనించినాడు. పాండవుల వనవాసకాలమున నభిమన్యుఁడు మేనమామలగు బలరామకృష్ణుల యింట నుండి సమస్తాస్త్ర శస్త్ర విద్యలు నభ్యసించెను. ఈతఁడు విరటుని పుత్రికయగు నుత్తరను, బలరాముని పుత్రికయైన శశిరేఖను వివాహమాడెను. బ్రతికిన కొలది కాలమైనను నీ బాలవీరశిఖామణి తన పవిత్ర చరిత్రమును ప్రతి మానవుఁడు, తన హృదయఫలకమున సువర్ణపంక్తులతో వ్రాసికొనునట్లు చేసినాఁడు.

భారతయుద్ధమున నొకనాఁడు ధర్మరాజును బట్టెదనని ద్రోణుఁడు ప్రతిజ్ఞఁ జేసి పద్మవ్యూహమును బన్నెను. ఆసమయమున నచ్చట కృష్ణార్జునులు లేరు. ఆవ్యూహమును భేదించుట కెవ్వరికిని సాధ్యముకాదు. ధర్మరాజు భయమంది దానిని భేదించుటకు నభిమన్యుని బంపెను. అభిమన్యుఁడు సాహసంబున విక్రమించి పద్మవ్యూహమును భేదించి లోపలఁ

ప్రవేశించెను. అప్పు డభిమన్యుని ఎవ్వరును దాఁకఁజాలక యుండిరి. కర్ణుడు మొదలగు వారెల్లరు నాతని బాణములచే నొప్పింపఁబడుచుండిరి. కురుసేన లాతని శరవర్షమునకు నిలువ లేక పరుగిడుచుండెను. ద్రోణాదుల కప్పుడేమి యుపాయము తోఁచలేదు.

కొంతసేపటికి ద్రోణుఁడు దుర్యోధనాదులఁజూచి "ఈ కుమారుని శౌర్య మపారమైయున్నది. అతనిచేతఁ జాప మున్నంతవఱకు, నాతని నెవ్వరును గూల్పఁ జాలరు. కావున నొకఁడు చాపము ద్రుంచవలయును. వేఱొకడశ్వములఁ గూల్ప వలయును. మఱొకడు రథము నుగ్గుసేయవలయును. అటుపై నందఱును గలిసి యాతని దాకవలయు"ననెను. అంతలకుఁ గర్ణాదు లందఱును గలిసి, యొక్క పెట్టునన భిమన్యుని దాకిరి. వ్యూహమునకీవల భీమాదు లుండిరి. వారు లోపలికి బోవుటకుఁ బ్రయత్నించిరి కాని, దుర్యోధనుని బావమఱదియగు సైంధవుఁడు వారిని వారించెను. వ్యూహములోనున్న యభిమన్యుని అనేకులు బాదివిరి. అభిమన్యుఁడిక దాను జీవింపనని నిశ్చయించుకొని, సంపూర్ణ పరాక్రమమునఁ దన శరములచే నందఱి కన్నివిధములఁ బ్రత్యుత్తరమిచ్చెను. తుదకు దుశ్శాసన సుతునితోఁ బోరు నవసరమున నొకరి గదాప్రహారము లొకరికి దాకి యిరువురు మడిసిరి.

బాలురారా! బాలుఁడయ్యును భారతయుద్ధమున నావిధమున బోరాడిన యభిమన్యునికథఁ జదివిన ప్రతిమానవుని శరీరమునఁ బులకలు పొడమునుగదా! అభిమన్యుఁడు మరణించినను ఆతనికీర్తి జగమున నేటికిని నిలిచి యున్నది.

# సురథుఁడు

సురథుఁడు చంపకాపురము బరిపాలించు హంసధ్వజుం డను నృపాలునకుఁ బుత్రుఁడు. మహాపరాక్రమవంతుఁడు, విష్ణుభక్తుఁడు. భారతయుద్ధానంతరమున ధర్మరాజు హయమేధయాగము జేయుటకుఁ బ్రారంభించి యశ్వమును భూమండలము దిరిగి రాఁబంచెను. దాని కంగరక్షకులుగా కృష్ణార్జును లేగిరి. ఆయశ్వము చంపకాపుర సమీపమున హంసధ్వజునిచే బంధింపఁబడెను. ఆసందర్భమున నర్జుననకును హంసధ్వజునకును యుద్ధము సంభవించెను. అందు హంసధ్వజుని జ్యేష్ఠపుత్రుఁడగు సుధన్వుఁ డర్జునునిచే నేలఁగూలెను. ఈ వార్త నాలించి సురథుఁడు యుద్ధభూమికి వచ్చెను. అతని శౌర్యపరాక్రమములకు దాళఁజాలక పాండవ బలములు పరుగిడఁదొడగెను. తుదకు ధైర్యము వహించి యర్జునుండాతని నెదుర్కొనెను. ఇరువురకును నతి భయంకరమైన యుద్ధము జరిగెను. ఎట్టకేలకర్జునుఁడు తీవ్రశరప్రయోగమున సురథుని శిరముగూల్చెను.

అప్పు డర్జునుని ప్రక్కనున్న కృష్ణుఁడు సురథుని శిరము నేలఁబడకుండ దన చేతితో బట్టుకొని, గరుత్మంతుని బిలిచి "వైనతేయా! నీ వీ సురథునిశిరము గొనిపోయి ప్రయాగయందు గంగాప్రవాహమున బడవైచిరమ్ము" అని యాజ్ఞాపించెను. కృష్ణభగవానుని యాజ్ఞననుసరించిగరుత్మం

తుఁడు శిరమును గొని యాకాశవీధిని బోవుచుండ వృషభ వాహనారూఢుఁడై పరమేశ్వరుఁ డామార్గమునఁ బోవుచు భృంగిరిటుని విలోకించి "సురధుని శిరము ప్రయాగనువైవ గరుత్మంతుఁడు గొనిపోవుచున్నాఁడు. నీవరిగి యాశిరమును నాకడకుఁదె"మ్మని నియమించెను. సుగధుని శిరమునకై గరుడునకును భృంగిరిటునకు కయ్యమొదవెను. ఆసందర్భమున సురధునిశిరము ప్రయాగజలమందుఁబడెను. అనంతరము భృంగిరిటుఁడు జలమందుఁబడిన యాశిరమును గొనిపోయి శివునకు సమర్పించెను. పరమేశ్వరుఁడా సురధునిశిరమును తనముండమాలికామధ్యమున నాయికమణిగాఁ జేసికొనెను.

"శూరులు, ధర్మచరిత్రులు, విజితేంద్రియులు మొదలగు మహనీయులశిరములు పరమేశ్వరుఁడు హారములుగా ధరించును."

# కృష్ణుఁడు

శ్రీకృష్ణుఁడు దేవకీ వసుదేవులకుఁ దనయుఁడు. అవతార పురుషుఁడు. బలరాముఁ డీతని కగ్రజుఁడు. ఈతఁడు ధరాభారము వాపుటకు యాదవకులమున జన్మించినాఁడు. బాల్యమునుండియు నీతఁడనేక మహిమలఁ బ్రకటించినాఁడు. లోకకంటకులయిన పెక్కు రుద్దు దైత్యులఁ జంపినాఁడు. పాండవు లీతనికి మేనత్తకొడుకులు. ఈతని దయచేతనే వారు భారత యుద్ధమునఁ గెలిచిరని చెప్పవచ్చును. చిన్నతనమునుండియుఁ గౌరవులు పాండవులకు గల్పించు కష్టములనుండి, కృష్ణుఁడే రక్షించుచు వచ్చెను. నిండుసభలో గౌరవులు ద్రౌపదికి మానహానియగుటకు వస్త్రము లొలుచుచుండఁగా, నా పతివ్రత "కృష్ణా రక్షింపు" మని వేడికొనినంతనే యామె కక్షయములగువలువ లొసంగెను. పాండవులకెట్లయిన రాజ్యభాగము సామము మీఁద నిప్పింప వలయునని, ధర్మరాజు పంపున రాయబారిగాఁ గౌరవులకడకుఁబోయి యనేకవిధములఁ జెప్పెను. దుర్యోధనుఁడు కృష్ణునిమాట వినకపోవుటయేగాక, యాతనినిసామాన్యమానవునిగాఁదలఁచిబంధింపఁ బ్రయత్నించెను. అప్పుడీతఁడు తన విశ్వరూపమును జూపెను. ఇదియంతయు నట్లుండ నర్జునుని యందున్న ప్రేమచే నీ మహానీయుఁడు యుద్ధమున నాతనికి సారథియై రథము నడిపెను. యుద్ధానంతరమునఁ ద్రోణాచార్యుని పుత్త్రుఁడగు నశ్వత్థామ

"అపాండవమగుగాక" యని యొక శరమును బ్రయోగించెను. ఆశరముచే నభిమన్యుని భార్యయగు నుత్తర గర్భమున నున్న శిశువు సంతాపించుచుండ, గృష్ణుఁడు రక్షించి పాండవ వంశము నిలఁబెట్టెను.

# ధ్రువుఁడు

ఉత్తానపాదుఁడను నొక రాజుండెను. అతనికి సునీతి సురుచి యను నిరువురు భార్యలుకలరు. అతనికి జిన్న భార్య యగు సురుచియందెక్కువ యనురాగముండెను. సునీతికి ధ్రువుఁడును, సురుచికి నుత్తముఁడు నను కుమారులు గలిగిరి. ఆకుమారులు తమ బాల్యక్రీడలచేఁ దల్లి దండ్రులకు సంతోషము గలిగించుచు దినదిన ప్రవర్ధమాను లగుచుండిరి. ఉత్తానపాదుఁ డెప్పుడును సురుచి గృహమునందేయుండి, పెద్ద భార్య కడకుఁ బోవకయుండెను.

ఇట్లుండ నొకదినమున సురుచి మందిరమున నుత్తాన పాదుఁడు తన తొడపై నుత్తమునిఁ గూర్చుండబెట్టుకొని ముద్దాడుచుండెను. సురుచియు నారాజు ప్రక్కనేయుండెను. ఆసమయమున ధ్రువుఁ డచ్చటికివచ్చి, తానుగూడ తండ్రి తొడపై నెక్కుటకు సంభ్రమ మందుచుండెను. ధ్రువుని సంతోషము సురుచి కనిపెట్టి, యీవలకు లాగి "నీకట్టిభాగ్య మున్నచో నాకడుపుననే పుట్టియుందువు. అట్టి భాగ్యము కావలసినచో హరి నాశ్రయింపు" మని పలికెను. ధ్రువుని నట్లు తన యొద్దకు రాకుండలాగిన సురుచినిఁజూచి, యుత్తాన పాదు డూరకుండెను. ధ్రువుఁ డాపరాభవమును సహింప జాలక యేడ్చుచుఁ దల్లియగు సునీతికడ కేగి యావృత్తాంతము నెఱింగించి యేడ్చెను. పాపము! ఆమెకూడ నందులకు

జింతించి "నాయనా! నిర్భాగ్యురాలైన నాకడుపునబుట్టుటచేత నీకిట్టి పరాభవము జరిగినది. కానిమ్ము. చింతించినందువలన లాభము లేదు. నీవు శ్రీహరి నాశ్రయింపుము. శుభములం బొందగల"వని చెప్పెను.

ధ్రువుఁడు తన కన్నతల్లిమాటలు మనస్సులోఁ బెట్టుకొని హరిగొఱకుఁ దపము సేయఁ దలఁచి పురమువిడిచి యరణ్యమార్గమును బట్టి పోవుచుండెను. అట్లుపోవుచున్న యా బాలునకు మార్గమధ్యమున నారదుఁ డెదురయ్యెను. ధ్రువుని యభిప్రాయము మా మునిపుంగవుఁ డెఱిగి యాయుద్యమమును మాని గృహమునకు మరలి పొమ్మని చెప్పెను.

ధ్రువుఁడు సమ్మతింపలేదు. అతఁడు మునీంద్రుని జూచి "మునీంద్రా! నీవెంతచెప్పినను నా చిత్తము తిరుగదు; నీవు బ్రహ్మకుఁ బుత్రుఁడవు నీకుదెలియని విషయములు లేవు. నాయందు దయయుంచి భగవంతుఁడగు శ్రీహరి యెట్లు ప్రసన్నుడగునో యామార్గమును నాకుఁజూపుము. నీకు వందనము లాచరించెద"నని పలికి, యాతని పాదములపైఁబడెను. నారదుఁ డా కుమారుని లేవనెత్తి యొక మంత్రము నుపదేశించి, యమునాతీరముననున్న మధువనమునకుఁబోయి తపము సేయుమని చెప్పెను.

నారదునిచే ననుజ్ఞఁబొంది ధ్రువుఁడు మధువనమునకుఁ బోయి శ్రీహరినిగూర్చి అయిదు మాసములు ఘోరమైన తపస్సుచేసెను. శ్రీహరి యాబాలుని భక్తికి సంతసించి ప్రసన్నుఁడయ్యెను. అతఁడు బాలుఁడగుటచే

నేవిధముగా భగవంతుని స్తుతింపవలయునో తెలియదయ్యెను. అప్పుడు శ్రీహరి బాలునితలఁ బెటిగి వేదవాక్కులచేఁ బూరింపఁడిన తనశంఖముచే నతనిశిరమంటెను. ఆక్షణముననే ధ్రువునకు దివ్యజ్ఞానము కలిగెను. అతఁడు భగవంతుని ననేకవిధముల స్తుతించెను. శ్రీహరి యతనింజూచి "ధ్రువుఁడా! నీవు నాకెంతయుఁగూర్చు భక్తుఁడవు. నీవు రాజ్యము పాలించు నప్పుడు నన్నుఁగూర్చి యాగములు సేయుము. సత్యము ధర్మము తప్పక రాజ్యమేలుము. కావలసిన భోగము లనుభవింపుము. అంత్యకాలమున నన్ను నీచిత్తమునఁ దలచుకొమ్ము. ఎవ్వరును బొందని దివ్యపదమును బొందఁగలవు" అని చెప్పి యదృశ్యుఁడయ్యెను.

అనంతరము ధ్రువుఁడు నిజపురమునకు వచ్చెను. కుమారుని రాకకు నుత్తానపాదుఁడు మిగుల మోదమందెను. సునీతి సంతోషమునకు మేరలేదు. సురుచి ధ్రువునింజూచి "భగవంతుని కరుణగలిగిన నీకెందును గొఱతయుండ"దని పలికెను. యుక్తవయస్కుఁడైనపిదప నుత్తానపాదుఁడు ధ్రువునకుఁ బట్టముగట్టి తాను తపోవనమును బ్రవేశించెను. ధ్రువుఁడు పెక్కేండ్లు రాజ్యము పాలించి, యనేక యాగములుచేసి శ్రీహరి కరుణచే మహోన్నతమైన పదమందెను.

# బలిచక్రవర్తి

బలియనునాతఁడు దైత్యులకుఁ జక్రవర్తి. అతఁడు రాక్షసుఁడైనను ధర్మసంధుఁడైయుండెను. గొప్ప దాతయని పేరుబొందెను. ఈతఁడు మహాపరాక్రమవంతుఁడు. మూడు లోకములవారును నీతనికి భయమందుచుందురు. ఈతఁడు దేవతల ననేకసారు లోడించెను. దేవత లీతనిదాడికిఁ దాళఁజాలక శ్రీమన్నారాయణుని సన్నిధికరిగి తమ బాధలఁదెలుపుకొనిరి.

శ్రీహరి వారిమొఱవినికరుణించి, బలిగర్వమునడంచుటకు వామనుఁడై యదితికశ్యపులకు జన్మించెను. అప్పుడు బలిచక్రవర్తి యొకగొప్పయాగమునుసేయుచు నెవరేదికోరిన నది యిచ్చెదనని ప్రతిజ్ఞ జేసియుండెను. ఇదియే సమయమని తలఁచి, వామనుఁడు నెమ్మదిగాబలి యాగము సేయుచున్న ప్రదేశమునకరిగి, బలింజేరి యాశీర్వదించెను. వామనుని యపూర్వతేజము సభ్యులకు మిగుల నాశ్చర్యమును గలిగించుచుండెను.

బలియు వామనుని పాదములకు నమస్కరించి యనేకభంగులఁబూజించి "బ్రాహ్మణోత్తమా! మహనీయుడవగు నీవు విచ్చేయుటంజేసి నాజన్మము పావనమైనది. అధ్వరఫలముగంటిని. నీయభీష్టమెట్టిదో తెలుపుము. తీర్చెద"నని పలికెను. వామనుఁడాతనింగాంచి తనకు మూడడుగుల నేల

దానమిచ్చినఁ జాలునని పలికెను. బలి యందులకు సమ్మతించి దాన మిచ్చుచుండఁగా నతని గురుండయిన శుక్రాచార్యుఁడు "ఇదియంతయు శ్రీహరి మాయ. ఇతఁడు నిజమైన భూసురుఁడు గాడు. నిన్ను వంచించుటకే శ్రీహరి ఇట్లు వచ్చినాఁడని తలంపుము" అని చెప్పెను. బలి యామాటల కంగీకరింపక "నాకెట్టి కీడు వచ్చినను సరే, ఆడినమాటఁ దప్ప"నని పలికి, యాతఁడు వామను డడిగిన మూడడుగుల నేలను ధారవోసెను.

అప్పుడు వామనుఁడుడైన శ్రీహరి విశ్వరూపము ధరించి, యొక యడుగుతో భూమిని మరియొక యడుగుతో నాకాశమును నాక్రమించెను. మూడవ యడుగునకు స్థలము కనఁబడలేదు. ఎక్కడఁ బెట్టుమనని బలి నడిగెను. "స్వామీ! నా తలపై బెట్టు"మని బలి భక్తిపూర్వకముగఁ జెప్పెను. అంతట వామనుఁడు తన పాదమును బలి శిరముపై బెట్టి యతనిని పాతాళమునకుఁ బంపెను. శ్రీహరి బలి భక్తికి, ధర్మసంధతకు, సంతసించి తన భక్తులలో ముఖ్యునిగాఁ జేసుకొనెను.

# ప్రహ్లాదుడు

ప్రహ్లాదుడు హిరణ్యకశిపుఁడను దానవేంద్రునకు బుత్రుఁడు. హిరణ్యకశిపుఁడు బ్రహ్మనుగూర్చి తపము సేయుటకుఁ బోయెను. అప్పుడాతని భార్యయగు లీలావతి గర్భిణియై యుండెను. హిరణ్యకశిపుఁడు పురమున లేడుకదా యని, దేవేంద్రుఁడు దైత్యుని వీటిపై కెత్తివచ్చి, లీలావతిని జెఱ బట్టుకొనిపోవుచుండెను. ఆసమయమున నారదు డచ్చటికి వచ్చి యింద్రునిఁ జూచి "మహేంద్రా! ఈమె గర్భమున పరమ భాగవతోత్తముఁ డున్నాఁడు. అతని పుట్టుకవలన మీ సంతాపములు తొలఁగు" నని చెప్పి విడిపించి, యామెను దన యాశ్రమమునకుఁ గొంపోయెను. నారదుని యాశ్రమము నందే లీలావతి ప్రసూతయై ప్రహ్లాదుని గాంచెను. హిరణ్యకశిపుఁడు తపమునుండి వచ్చినతరువాత, నారదుఁడు కుమార సహితముగా లీలావతిని, దానవేంద్రునికడకుఁ దోడ్కొని పోయి యొప్పగించెను. హిరణ్యకశిపుఁడు కుమారుని జూచి యానందించెను.

ప్రహ్లాదునకు యుక్తవయస్సు రాగానే విద్యాభ్యాసమున కై గురువుల కొప్పగించిరి. అతఁడు బాలుఁడయ్యు తోడి బాలురతో నాడుకొనక యొక్కొక్క సమయమున వెఱ్ఱివాని వలెఁ గనఁబట్టుచుండును. మఱియొక సమయమున బిచ్చివాని వలె హరిం బాడుచుండును మఱియొక సమయమున గంతులు

వేయుచుఁ దనలో దాన మాటలాడుకొనుచుండును. కొన్నా ళ్ళయిన పిదప హిరణ్యకశిపుఁడు కుమారుని రావించి తన తొడలపైఁ గూర్చుండఁ బెట్టుకొని "నాయనా! నీ వేమి చదివితివి" అని యడిగెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు సర్వము విష్ణుమయమని నేను గ్రహించితినని పలికెను. ప్రహ్లాదుని మాటలకు దైత్యేంద్రుండు మిగుల నద్భుతమందెను. తనకు విరోధియైన శ్రీహరింగూర్చి యక్కుమారున కెవ్వరు బోధించిరో యని యాతఁడు సంశయించెను. మరల నక్కుమారునకు నీతులుగఱపి తెండని ప్రహ్లాదుని గురులవశము జేసెను.

గురువులు చెప్పెడు శాస్త్రములు వినక ఆకుమారు డెప్పుడును శ్రీహరిని కీర్తించుచు తోడి బాలకులను గూడ హరిభక్తులుగాఁ జేసెను. అతని చిత్తమును గురువులు మరలింప లేకపోయిరి. గురువు లంతట కుమారుని హిరణ్యకశిపుని ముందుఁ బెట్టి సర్వము జెప్పిరి. హిరణ్యకశిపుఁడు హరిభక్తి మానుమని కుమారున కెంతయో బోధించెను. అతఁడు వినలేదు. అనేక విధముల హింసించెను. అందులకు జలింపలేదు.

తుదకు దానవేంద్రుఁడు కొడుకుంజూచి యిట్లు పలికెను. "ఓరీ! ఆ హరి నాకు విరోధి. నీ పినతండ్రిని జంపినాడు. అట్టివానిని నీవేల స్తుతించెదవు? నేను వాని కొఱకు వెదకితిని. ఎక్కడను గనిపించలేదు. వాఁ డెక్కడ నుండు?" తండ్రిమాటలు విని "తండ్రీ! ఆతఁడు ప్రతిస్థలమున నున్నా" డని బదులుచెప్పెను. అంతట "దైత్యుఁడు అట్లయిన నీ వా

దురు. మనదారిద్ర్యమును గూర్చి కొంచెమైనను విచారింపక యున్నాఁడు. ఏదైవమార్గము జూచినగాని బ్రతుకఁజాలము. కృష్ణుఁడు మీాకు బాల్యస్నేహితుఁడుకదా! అతఁడు మహాభాగ్యవంతుఁడు. మీారాతనియొద్దకుఁ బోయినచో నేమైన నొసంగగలడు" అనిచెప్పెను.

కుచేలుఁ డందులకు సమ్మదమున సమ్మతించెను. కాని రిక్తహస్తములతోఁ గృష్ణుని నెట్లుజూతునా యని విచారించి, యామాట యామెకుఁ దెలిపెను. అప్పుడా పతివ్రత యింటనున్న యటుకులు కొన్ని తన మగని జీర్ణచేలమునకు గట్టి యవి వాసుదేవున కిండని పలికెను.

కుచేలుఁడు బయలుదేరి హరిని స్మరించుకొనుచు దిన దిన ప్రయాణములు సేయుచు ద్వారకాపురము జేరెను. అచ్చటి జనులచే త్రోవఁజూపఁబడి యాతడు కృష్ణునిమందిరమును సమీాపించి యచటనున్న ద్వారపాలుర బ్రతిమాలుకొని తనరాక కృష్ణున కెఱిగింపుఁడని పలికెను. ఆద్వారపాలకులు లోనికేగి కృష్ణునిఁజూచి "దేవా! మీా మిత్రుఁడట, కుచేలుఁడట, వచ్చినా"డని చెప్పిరి. వెంటనే కృష్ణుఁడు తల్పముడిగి కుచేలున కెదురువచ్చి నమస్కరించి తోడ్కొనిపోయి తన తల్పమునందే యాసీనుం జేసి బహువిధములఁ బూజించి కుశలప్రశ్నము లడిగెను. కుచేలునకు పతి యానతి ననుసరించి రుక్మిణి సురటితో వీవ దొడఁగెను. ఇది యంతయుఁ జూచి యంతఃపురపరిచారికలాశ్చర్యమును బొందుచుండిరి. కృష్ణుఁడు కుచేలునిగాంచి "మిత్రమా! నాకొఱకేమి కానుకదెచ్చితి"

వని యడిగెను. కుచేలుఁడు తన జీర్ణచేలమున గట్టఁబడిన యటుకుల నిచ్చుటకు సిగ్గుపడి యూరకుండెను. కాని కృష్ణుఁ డది గ్రహించి తానే యామూటను విప్పుకొని పిడికెడటుకులు నోటవేసుకొని, రెండవపిడికిలిగూడబట్టి భుజింపఁ దలంచెను.

అప్పుడు రుక్మిణి కృష్ణునిహస్తము బట్టుకొని "దేవా! జగన్నాథా ! ఈకుచేలుని మహదైశ్వర్యవంతునిఁ జేయుట కివి చాలు"నని పలికెను. తరువాత కృష్ణుఁడు కుచేలునకు షడ్రసోపేతముగా విందుచేసి, యమూల్యవస్త్రాభరణాదులనొసంగి పంపెను.

కుచేలుఁ డింటికి వచ్చుసరికి, అంతకు ముందు తానున్న జీర్ణకుటీరము మహాసౌధమైయుండెను. ఎక్కడజూచి నను రత్నరాసులే. అతనిభార్య యెదురుగావచ్చి యతనిం దోడ్కొనిపోయెను. ఈవైభవమంతయుఁ గృష్ణుని యనుగ్రహమునఁ గలిగెనని సంతసించి, యాతఁడు నిరంతరము హరిభక్తి గలిగియుండెను.

కల్యాణీ ప్రెస్, తెనాలి—11-45/100కాపీలు.